**రచయిత ఇతర గ్రంథములు**














పుస్తకాలు కొనడానికి వాట్సాప్ నెంబరు 9000274345 కి మెసేజు పంపండి.

మరిన్ని వివరాలకు మేయిల్ పంపండి.

Email-vbraju66@gmail.com


# మతం మారిన క్రైస్తవుడా!

## బైబిల్ దైవగ్రంథమా అందులో ఉన్నది నిజ దేవుడా?






డా॥ వి. భాస్కర్ రాజు

**Matham Marina Kraistavuda!**
*Bible Daiva Grandhama?*
*Andulo Unnadi Nija Devuda?*
by **Dr. V. Bhaskar Raju**

**మతం మారిన క్రైస్తవుడా!**
*బైబిల్ దైవ గ్రంథమా?*
*అందులో ఉన్నది నిజ దేవుడా?*
రచన:
**డా॥ వి. భాస్కర్ రాజు**

ప్రథమ ముద్రణ: ఆగష్టు, 2022 - శుభకృత్ - భాద్రపదం

ప్రతులు: 2000
పుటలు : 28 డెమ్మీ సైజు, పేపర్ బ్యాక్
వెల: రూ. 20/- (ఇరవై రూపాయలు)
ప్రాప్తిస్థానం:
**వివిధ పుస్తక విక్రయ కేంద్రాలలో** మరియు
సెల్ & వాట్సాప్ : 9000274345
E-mail : vbraju66@gmail.com

ముద్రణాపర్యవేక్షణ &
కవర్‌పేజీ డిజైన్ : శ్రీ షకీల్ అహ్మద్, 9959652570

ముద్రణ: కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్, 40, ఎపిహెచ్‌బి, విద్యానగర్,
హైదరాబాద్ - 500044, తెలంగాణ,
ఫోన్: 040-27618261



మొదటి ప్రశ్న

## నీ గ్రంథం పరిశుద్ధమైనదా? పరిశుద్ధతకు నిర్వచనం ఏమిటి?

ప్రపంచంలో అనేక మతాలు ఉన్నాయి. ప్రతి మతం వారికి వారి మత గ్రంథం ఉంటుంది. క్రైస్తవులకు బైబిల్ మాల గ్రంథం. కానీ పూర్తి బైబిల్లో బైబిల్ అనే పేరు ఎక్కడా ఉండదు; ఈ గ్రంథంలో ఎన్ని పుస్తకాలు ఉన్నాయి అనే వివరణ ఉండదు. ప్రొటెస్టెంటు బైబిల్లో 66 పుస్తకాలు (పాత నిబంధనలో 39, కొత్త నిబంధనలో 27) ఉండగా, కాథోలిక్ బైబిల్‌లో 73 పుస్తకాలు (పాత నిబంధనలో 46, కొత్త నిబంధనలో 27) ఉన్నాయి. కౌన్సిల్ ఆఫ్ రోమ్ (382 CE) నుండి కౌన్సిల్ ఆఫ్ ట్రెంట్ (1545-1563 CE) వరకు మత పెద్దలు కాథలిక్ బైబిల్ 73 పుస్తకాల ఉండాలని నిర్ణయించారు. కాథోలిక్ బైబిల్‌లో కానీ, ప్రొటెస్టెంటు బైబిల్‌లో కాని ఎన్ని పుస్తకాలు ఉండాలో నిర్ణయించింది బైబిల్ దేవుడు కాదు, మనుషులు. మరి అంతకు ముందు ఉన్న ఇతర పుస్తకాల సంగతి ఏమిటి? అవి పరిశుద్ధమైనవి కావా?

దీనిని బట్టి ఎవరి అనుకూలంగా ఉన్నాయో వారు ఆ గ్రంథాలను బైబిల్‌లో పెట్టుకున్నారు. అనుకూలంగా లేని వాటిని తొలగించారు. మనుషులు నిర్ణయించిన పుస్తకాలతో సంకలనం చేయబడిన బైబిల్ ఎలా పరిశుద్ధమైన గ్రంథం అవుతుంది? పరిశుద్ధమని చెప్పబడినంత మాత్రాన, పరిశుద్ధ గ్రంథం అని చెప్పుకున్నంత మాత్రాన గ్రంథం పరిశుద్ధం అవుతుందా? కాదు. ఈ పరిశుద్ధత బైబిల్ దేవుడు, ఆయన చేసే పనులలో, లేక ప్రవక్తల పనులలో కనిపించాలి. మరి కనిపిస్తాయా? ఎక్కడా కనిపించవు.

బైబిల్ పైన పరిశుద్ధ గ్రంథం అనే పేరు ఉంటుంది. దీని అర్థం ఏమిటి? గ్రంథం పరిశుద్ధమా లేక దానిలో చెప్పబడిన విషయాలు పరిశుద్ధమా? పరిశుద్ధతకు

నిర్వచనం ఏమిటి? కొన్ని బైబిల్ వచనాలను గమనించండి.

**యెషయా గ్రంథము 6:3-వారు సైన్యముల కధిపతియగు యెహోవా, పరిశుద్ధుడు పరిశుద్ధుడు పరిశుద్ధుడు; సర్వలోకము ఆయన మహిమతో నిండియున్నది అని గొప్ప స్వరముతో గాన ప్రతి గానములు చేయుచుండిరి.**

**కీర్తనల గ్రంథము 77:13-దేవా, నీ మార్గము పరిశుద్ధమైనది. దేవుని వంటి మహా దేవుడు ఎక్కడనున్నాడు?**

**కీర్తనల గ్రంథము 11:4-యెహోవా తన పరిశుద్ధాలయములో ఉన్నాడు. యెహోవా సింహాసనము ఆకాశమందున్నది. ఆయన నరులను కన్నులార చూచుచున్నాడు. తన కను దృష్టి చేత ఆయన వారిని పరిశీలించుచున్నాడు.**

**కీర్తనల గ్రంథము 15:1-యెహోవా, నీ గుడారములో అతిథిగా ఉండదగినవాడెవడు? నీ పరిశుద్ధ పర్వతము మీద నివసింపదగిన వాడెవడు?**

మేరియమ్ వెబ్‌స్టర్ నిఘంటువు ప్రకారం-పరిశుద్ధతకు ఇలాంటి నిర్వచనం చెప్పవచ్చును. మంచితనం ఉన్నవాడు, ఉన్నతమైన వాడు, పరిపూర్ణుడు మరియు పూర్తి భక్తికి అర్హుడు. బైబిల్ దేవుడికి ఈ లక్షణాలు ఉన్నాయా అనేది మనం గమనించగా, సుదూరం వరకు ఇలాంటి ఉన్నతమైన లక్షణాలు కనిపించకపోగా, పరమ దుర్మార్గమైన పద్ధతులను పాటించుతూ, తన సొంత ప్రజలకే నరకాన్ని చూపిస్తాడు.

ఇక యేసు గురించి చెప్పుకోవాలి. బైబిల్ దేవుడికి కొడుకు, లేక దేవుడికి సమానమైన వాడు అని చెప్పబడుతున్నా ఇతడి పూర్వికుడు అబ్రాహాము తన సొంత చెల్లెలిని పెళ్లి చేసుకొని, ఫెరో రాజును మోసం చేసి, ధనాన్ని, పశువులను సంపాదించుకున్నాడు. యాకోబు తన సొంత అన్నను మోసం చేసినా, బైబిల్ దేవుడు ఈ మోసగాడిని శిక్షించకుండా, ఇతడినే ఆశీర్వదించాడు. యూదా తన సొంత కోడలితో వ్యభిచారం చేసి పెరెసును కనగా, ఆ పెరెసు వంశము నుండే యేసు వచ్చాడు. యేసు వచ్చిన వంశములో రహాబు అనే వేశ్య కూడా ఉంది.



అహాజు బైబిల్ దేవుడినే నమ్మలేదు. ఇంత ఘన చరిత్ర ఉన్న యేసు ఎలా పరిశుద్ధుడు అవుతాడు?

బైబిల్ దేవుడు పాపము లేని వాడు అంటారు; అందుకే ఆయన పరిశుద్ధుడు అంటారు. బైబిల్ దేవుడు చేసిన పాపిష్టి పనులు చూస్తే, ఆయనలో పాపము మాత్రమే కాదు, ఆయనను నమ్ముకుంటే సర్వనాశము అవుతామని నాకు అనిపిస్తుంది. అంతే కాదు బైబిల్ దేవుడిని మనం నమ్మకూడదు. ఈయన అందరి దేవుడు కాదు; కేవలం ఇశ్రాయలీ దేవుడు.

**ద్వితీయోపదేశకాండము 14:2-ఏలయనగా నీ దేవుడైన యెహోవాకు నీవు ప్రతిష్ఠిత జనము. మరియు యెహోవా భూమి మీద నున్న సమస్త జనములలో విశేషముగా తనకు స్వకీయ జనమగునట్లు నిన్ను ఏర్పరచుకొనెను.**

**రెండవ సమూయేలు 7:24-మరియు యెహోవావైన నీవు వారికి దేవుడవైయుండి, వారు నిత్యము నీకు ఇశ్రాయేలీయులను పేరు గల జనులై యుండునట్లుగా వారిని నిర్ధారణ చేసితివి.**

**మొదటి దినవృత్తాంతములు 17:21-నీ జనులైన ఇశ్రాయేలీయులవంటి జనము భూలోకమందు ఏది? ఐగుప్తులో నుండి నీవు విమోచించిన నీ జనుల యెదుట నిలువనీయక నీవు అనేక జనములను తోలి వేసినందువలన నీవు మహా భయంకరమైన పేరు తెచ్చుకొంటివి. వారు నీ స్వంత జనులగునట్లు వారిని విమోచించుటకై దేవుడవైన నీవు బయలుదేరితివి.**

ఈ వచనాలు అన్నీ చదివితే, ఈ బైబిల్ దేవుడు కేవలం ఇశ్రాయలీ దేవుడని, వారు కల్పించుకున్న దేవుడని, వారి బాగు కొరకు మాత్రమే పాటు పడ్డాడని, కనానీయులు, అమ్మోనీయులు లాంటి ఇతర అనేక జాతులను సర్వనాశనం చేశాడని బైబిలే సాక్ష్యం ఇస్తుంది. మనకు సంబంధంలేని గ్రంథం, మతం, దేవుడు మనకు అవసరమా?

రెండవ ప్రశ్న

## నీవు నమ్ముతుంది దేవుడినేనా?
## మానవులను నాశనం చేసే దుష్ట శక్తినా?

బైబిల్ దేవుడు అందరికి దేవుడైతే, లక్షలు, కోట్ల సంఖ్యలో ఉన్న ఇతర జాతులను ఇశ్రాయేలు ప్రజల ద్వారా ఎందుకు నాశనం చేయించాడు? ఇశ్రాయేలు వారిని రక్షించుతానని చెప్పిన అతడు ఫెరో రాజును ఇబ్బంది పెట్టి, ఇశ్రాయేలు ప్రజలను బయటికి రప్పించడానికి అతడి రాజ్యం పైన అనేక తెగుళ్ళను పుట్టించాడు. దీనిని బట్టి ఫెరోకు, ఆయన ప్రజలకు వేరే దేవుళ్లు ఉన్నారని తెలియడం లేదా? బైబిల్ దేవుడు సదా ఇశ్రాయేలు ప్రజల బాగునే పట్టించుకున్నాడు. ఇతరులను అన్యులు అంటూ, వారిని లక్షల సంఖ్యలో చంపించాడు.

బైబిల్ దేవుడు ఇశ్రాయేలు ప్రజల కోసం ఇతర జాతులను, ఇతర దేశాలను నాశనం చేయించాడు.

**నిర్గమకాండము 23:23-ఎట్లనగా నా దూత నీకు ముందుగా వెళ్లుచు, అమోరీయులు, హిత్తీయులు, పెరిజ్జీయులు, కనానీయులు, హివ్వీయులు, యెబూసీయులను, వారున్న చోటుకు నిన్ను రప్పించును, నేను వారిని సంహరించెదను. 24- వారి దేవతలకు సాగిలపడకూడదు, వాటిని పూజింప కూడదు; వారి క్రియల వంటి క్రియలు చేయక వారిని తప్పక నిర్మూలము చేసి, వారి విగ్రహములను బొత్తిగా పగులగొట్టవలెను.**

అంతే కాదు. ఇతరులు పూజించుకునే మందిరాలను, దేవతా విగ్రహాలను నాశనం చేయమని ప్రేరేపించుతున్నాడు. వారి దేశాలను ఆక్రమించుకొని, వారిని వెళ్లగొట్టమని చెబుతున్నాడు.





**నిర్గమకాండము 23:30-నీవు అభివృద్ధి పొంది ఆ దేశమును స్వాధీనపరచుకొను వరకు క్రమక్రమముగా వారిని నీ యెదుట నుండి వెళ్లగొట్టెదను. 31-మరియు ఎఱ్ఱ సముద్రము నుండి ఫిలిష్తీయుల సముద్రము వరకును అరణ్యము నుండి నది వరకును నీ పొలి మేరలను ఏర్పరచెదను, ఆ దేశ నివాసులను నీ చేతి కప్పగించెదను. నీవు నీ యెదుట నుండి వారిని వెళ్లగొట్టెదవు.**

ఇలాంటి వాడు దేవుడు అని చెప్పుకోవడానికి అనర్హుడు. అందరికి దేవుడు అయితే ఇతర జాతులను ఎందుకు చంపమని ప్రేరేపిస్తున్నాడు? **ద్వితీయోపదేశకాండము 20:16-అయితే నీ దేవుడైన యెహోవా స్వాస్థ్యముగా నీకిచ్చుచున్న యీ జనముల పురములలో ఊపిరిగల దేనిని బ్రదుకనియ్యకూడదు. 17-వీరు, అనగా హిత్తీయులు, అమోరీయులు, కనానీయులు, పెరిజ్జీయులు, హివ్వీయులు, యెబూసీయులను వారు తమ తమ దేవతల విషయమై చేసిన సమస్త హేయకృత్యముల రీతిగా మీరు చేసి, 18-నీ దేవుడైన యెహోవాకు విరోధముగా పాపము చేయుటకు వారు మీకు నేర్పకుండునట్లు నీ దేవుడైన యెహోవా నీ కాజ్ఞాపించిన ప్రకారముగా వారిని నిర్మూలము చేయవలెను.**

ఇశ్రాయేలు దేవుడు తన ప్రజలకు దేశాలు ఇస్తానని చెప్పినప్పుడు, తాను దేశాలను, రాజ్యాలను వారికి నిర్మించి ఇవ్వాలి. ఈయన అలా చేయడు. ఈయన ఇతరులు నిర్మించుకున్న రాజ్యాలను ఆక్రమించుకొని, అక్కడ ఉన్న వారిని చంపి, దానిని మీ రాజ్యంగా చేసుకోమని చెబుతున్నాడు. ఎంత దయగల దేవుడు కదా! ఇతర జాతులు, అనగా అన్యులు వారి దేవతలను ఎలా పూజించుకోవాలో ఈయన నిర్ణయించేది ఏమిటో మనకు అర్థం కాదు. అన్యులు నరహంతకులు; పిల్లలను బలిగా ఇస్తారు, జంతువులతో కూడా సంభోగం చేస్తారు అని వారి పైన ముద్ర వేసి, వారిని చంపడానికి సాకును చూపిస్తాడు. బైబిల్ దేవుడు ఎంత దరిద్రమైన బలులను కోరతాడో, అవి ఎంత చంధాలంగా ఉంటోయో, ఇశ్రాయేలు ప్రజలే కాదు, చివరికి ప్రవక్తలు కూడా ఎన్ని అక్రమమైన సంబంధాలు కలిగి ఉన్నారో మనం బైబిల్‌లో చదువుకోవచ్చును. ఇశ్రాయేలు ప్రజల కంటే అన్యులు మంచి వారని పౌలు కూడా బైబిల్‌లో చెబుతాడు.

**మొదటి కొరింథీయులకు 5:1-మీలో జారత్వమున్నదని వదంతి కలదు. మీలో ఒకడు తన తండ్రి భార్యను ఉంచుకొన్నాడట. అట్టి జారత్వము అన్యజనులలోనైనను జరుగదు.**

సర్వశక్తివంతుడైన బైబిల్ దేవుడిని నమ్మిన ఇశ్రాయేలు, యూదు ప్రజలు గుడారాల్లో ఉండగా, ఇతరులను దోచుకొని బ్రతుకుతుండగా, ఐగుప్తు మరియు ఇతర జాతుల వారు బ్రహ్మాండమైన రాజ్యాలు, అద్భుతమైన జీవన విధానం కలిగి ఉన్నారు. పోనీ బైబిల్ దేవుడు కనీసం ఇశ్రాయేలు ప్రజలనైనా వదిలి పెట్టాడా? వాళ్ళలో లక్షల మందిని చంపింది అన్యులతో యుద్ధం చేసి కాదు, వాళ్ళ మరణానికి కారణం బైబిల్ దేవుడు.

బైబిల్ దేవుడు తాను ప్రశాంతంగా ఉండడు; ఇతరులను ప్రశాంతంగా ఉండనివ్వడు. ఇశ్రాయేలు ప్రజలకు సరైన తిండి పెట్టకుండా, నీళ్ళు లేకుండా పరీక్షించి, వాళ్ళు గొణుక్కుంటే చాలు, వారిని చంపడానికి కూడా వెనుకాడడు.

**నిర్గమకాండము 17:3-అక్కడ ప్రజలు నీళ్ళులేక దప్పిగొని మోషే మీద సణుగుచు-ఇదెందుకు? మమ్మును మా పిల్లలను మా పశువులను దప్పిచేత చంపుటకు ఐగుప్తులో నుండి ఇక్కడికి తీసికొని వచ్చితిరనిరి.**

**సంఖ్యాకాండము 21:5-కాగా ప్రజలు దేవునికిని మోషేకును విరోధముగా మాటలాడి-ఈ అరణ్యములో చచ్చుటకు ఐగుప్తులోనుండి మీరు మమ్ము నెందుకు రప్పించితిరి? ఇక్కడ ఆహారము లేదు, నీళ్ళు లేవు, చవిసారములు లేని యీ అన్నము మాకు అసహ్య మైనదనిరి. 6-అందుకు యెహోవా ప్రజలలోనికి తాపకరములైన సర్పములను పంపెను; అవి ప్రజలను కరువగా ఇశ్రాయేలీయులలో అనేకులు చనిపోయిరి.** ఇదీ ఈ దేవుడి గొప్పదనం. సొంత ప్రజలకే గతి లేదు, మనకు మేలు చేస్తాడా?

ఒక రోజు బైబిల్ దేవుడికి ఎందుకో ఇశ్రాయేలు ప్రజల పైన కోపం వస్తుంది. **రెండవ సమూయేలు 24:1-ఇంకొకమారు యెహోవా కోపము ఇశ్రాయేలీయుల**





**మీద రగులుకొనగా ఆయన దావీదును వారి మీదికి ప్రేరేపణచేసి-నీవు పోయి ఇశ్రాయేలువారిని యూదా వారిని లెక్కించుమని అతనికి ఆజ్ఞ ఇచ్చెను.**

మొదటి దినవృత్తాంతములు గ్రంథంలో సాతాను వెళ్లి దావీదును ప్రేరేపించాడు అని ఉంటుంది. *సాతానును పంపించేది బైబిల్ దేవుడే కదా?* దావీదు ప్రజలను లెక్క వేసి, తాను పాపము చేశానని గ్రహించి, తాను అవివేకినని, తన దోషమును మన్నించమని అడిగినా మన్నించడు బైబిల్ దేవుడు. తాను మూడు రకాల ఎంపికలను ఇచ్చి, కోరుకోమంటాడు. ఏమో నీ ఇష్టం నీకే ఆ నిర్ణయం వదులుతున్నాను అంటాడు దావీదు. తరువాత ఏం చేశాడో మీరే చదువుకోండి.

**రెండవ సమూయేలు 24:15- అందుకు యెహోవా ఇశ్రాయేలీయుల మీదికి తెగులు రప్పించగా ఆ దినము ఉదయము మొదలుకొని సమాజ కూటపు వేళ వరకు అది జరుగుచుండెను; అందుచేత దాను నుండి బెయేర్షెబా వరకు డెబ్బది వేల మంది మృతి నొందిరి.** అదీ సంగతి! అంతే కాదు. ఈయన వారిలో వారికే యుద్ధాలను, విభేదాలను సృష్టించి, వారు ఒకరిని ఒకరు చంపుకునేలాగా చేస్తాడు. వారు తనను పూజించలేదని, వారిని వారి శత్రువులకు అప్పగించాడు. వారి భార్యలను ఇతరులకు అప్పగించాడు. వారి రాజ్యాలను, ఇండ్లను ఇతరులకు అప్పగించాడు.

**ద్వితీయోపదేశకాండము 28:51-నిన్ను నశింపజేయు వరకు నీ పశువులను నీ పొలముల ఫలములను వారు తినివేతురు. నిన్ను నశింపజేయు వరకు ధాన్యమునేగాని, ద్రాక్షారసమునేగాని, తైలమునే గాని, పశువుల మందలనేగాని, గొఱ్ఱె మేకమందలనేగాని, నీకు నిలువనియ్యరు. 52 - మరియు నీవు ఆశ్రయించిన ఉన్నత ప్రాకారములుగల నీ కోటలు పడు వరకును నీ దేశమందంతటను, నీ గ్రామములన్నిటిలోను, వారు నిన్ను ముట్టడి వేయుదురు. నీ దేవుడైన యెహోవా నీకిచ్చిన నీ దేశమందంతటను, నీ గ్రామములన్నిటిలోను, నిన్ను ముట్టడి వేయుదురు. 53-అప్పుడు ముట్టడిలోను నీ శత్రువులు నిన్ను పెట్టు ఇబ్బందిలోను నీ గర్భఫలమును, అనగా నీ దేవుడైన యెహోవా నీకిచ్చిన నీ కుమారుల యొక్కయు**

**నీ కుమార్తెల యొక్కయు మాంసమును తిందువు.**

తన సొంత ప్రజలు, ప్రతిష్టిత జనులు తనను పూజించడం లేదని కోపం వచ్చిన బైబిల్ దేవుడు, వాళ్ల తన సొంత కుమారుల, కుమార్తెల మాంసమును వండుకొని తినే విషమ పరిస్థితులను కల్పించుతాడట.

**యెహెజ్కేలు 5:9-నీ హేయ కృత్యములను బట్టి పూర్వమందు నేను చేయని కార్యమును, ఇక మీదట నేను చేయ బూనుకొనని కార్యమును నీ మధ్య జరిగింతును. 10-కావున నీ మధ్య తండ్రులు తమ కుమారులను భక్షింతురు, కుమారులు తమ తండ్రులను భక్షింతురు, ఈ ప్రకారము నేను నీకు శిక్ష విధించి నీలో శేషించిన వారిని నలుదిశల చెదరగొట్టుదును.** ఎంత దయగల దేవుడో మీకు అర్థం అవుతుందా?

అన్నంత పని చేశాడు బైబిల్ దేవుడు.

ఒక సందర్భంలో ఒక స్త్రీ వెళ్లి ఇశ్రాయేలీ రాజుకు మొర పెట్టుకుంటుంది. ఆ రాజు ఏమిటని అడుగుతాడు. **రెండవ రాజులు 6:28-నీ విచారమునకు కారణమేమని యడుగగా అది-ఈ స్త్రీ నన్ను చూచి-నేటి ఆహారమునకు నీ బిడ్డను ఇమ్ము రేపు మనము నా బిడ్డను భక్షించుదుము, అని చెప్పినప్పుడు, 29-మేము నా బిడ్డను వంట చేసికొని తింటిమి. అయితే మరు నాటి యందు నేను దాని చూచి-నేటి ఆహారమునకు నీ బిడ్డను ఇమ్మని అడిగితిని గాని అది తన బిడ్డను దాచిపెట్టెనని చెప్పెను.**

**విలాపవాక్యములు 4:10-వాత్సల్యముగల స్త్రీల చేతులు తాము కనిన పిల్లలను వండుకొనెను. నా జనుల కుమారికి వచ్చిన నాశనములో వారి బిడ్డలు వారికి ఆహారమైరి.** ఇలాంటి దుష్ట శక్తిని దేవుడని నమ్మే బదులు, నేను నాస్తికుడిగా ఉండడానికి ఇష్టపడతాను. క్రైస్తవులు! మీరూ ఆలోచించండి.





మూడవ ప్రశ్న

# నీ ప్రవక్తలు నీతివంతులా? మానవులకు మార్గం చూపగలరా?

బైబిల్‌లో ఉన్న మా దేవుడు, మా ప్రవక్తలు ప్రపంచానికి నీతిని నేర్పించారని, మానవులు ఎలా బ్రతకాలో నేర్పించారని క్రైస్తవులు చెబుతుంటారు. అసలు వాళ్లకు నీతి ఉందా? బైబిల్ దేవుడు ఎంత క్రూరుడో, ఎంత మంది అమాయకులను చంపించాడో రెండవ ప్రశ్నకు జవాబుగా తెలుసుకున్నాం. నోవాహును బైబిల్ దేవుడు నీతిమంతుడిగా ఎంచాడు.

**ఆదికాండము 7:1-యెహోవా-ఈ తరమువారిలో నీవే నా యెదుట నీతిమంతుడవై యుండుట చూచితిని గనుక నీవును నీ యింటి వారును ఓడలో ప్రవేశించుడి.** ఇంతటి నీతిమంతుడైన నోవాహు ప్రళయం తరువాత, కొడుకులు, కోడళ్లు, మనుమలు ఉన్న ఇంట్లో మందు తాగి, తాను వేసుకున్న బట్టలు ఎలా ఉన్నాయో కూడా తెలియ స్థితిలో ఉంటాడు.

**ఆదికాండము 9:20-నోవహు వ్యవసాయము చేయనారంభించి, ద్రాక్షతోట వేసెను. 21-పిమ్మట ద్రాక్షారసము త్రాగి మత్తుడై తన గుడారములో వస్త్రహీనుడుగా నుండెను.**

బైబిల్‌లో చెప్పబడిన మరో గొప్ప ప్రవక్త అబ్రాహాము. ఈయనను బైబిల్ దేవుడే ఆశీర్వదించాడు. **ఆదికాండము 12:3-నిన్ను ఆశీర్వదించు వారిని ఆశీర్వదించెదను; నిన్ను దూషించువాని శపించెదను; భూమి యొక్క సమస్త వంశములు నీ యందు ఆశీర్వదించబడునని అబ్రాముతో అనగా.** స్వయానా సృష్టికర్త అయిన దేవుడు తనతో ఉన్నా, ఐగుప్తుకు వెళ్లిన ఈయన, తనను, తన భార్య అయిన శారాయిని ఫెరో ఏదో చేస్తాడని భయపడతాడు. ఇలా అంటాడు.

**ఆదికాండము 12:11-అతడు ఐగుప్తులో ప్రవేశించుటకు సమీపించినప్పుడు అతడు తన భార్యయయిన శారయితో-ఇదిగో నీవు చక్కనిదానివని యెరుగుదును. 12-ఐగుప్తీయులు నిన్ను చూచి యీమె అతని భార్య అని చెప్పి నన్ను చంపి నిన్ను బ్రదుక నిచ్చెదరు.** ఫెరోకు, ఐగుప్తులకు శారయి తన చెల్లెలు అని పరిచయం చేస్తాడు. ధనాన్ని, పశువులను సంపాదించుకుంటాడు. నిజంగానే శారయి అబ్రాహాముకు చెల్లెలు వరస అవుతుంది. తండ్రి ఒక్కరే, తల్లులు వేరు. ఎంత గొప్ప నీతి చూడండి. సొంత చెల్లెలును పెళ్లి చేసుకునే గొప్ప సాంప్రదాయం!

**ఆదికాండము 12:16-అతడామెను బట్టి అబ్రామునకు మేలు చేసెను; అందువలన అతనికి గొఱ్ఱెలు, గొడ్లు, మగ గాడిదలు, దాసులు, పనికత్తెలు, ఆడుగాడిదలు, ఒంటెలు ఇయ్యబడెను.** శారయి అబ్రాహాము భార్య అని తెలిసి ఫెరో అతడిని మందలిస్తాడు. శారయిని అబ్రాహాముకి అప్పగించి మరింత ధనాన్ని బహుమానంగా ఇస్తాడు. ఫెరో ఎంత నీతిమంతుడో, అబ్రాహాము అనే ఈ బైబిల్ ప్రవక్త అంత మోసగాడు. ఈ మోసగాడిని నీతిమంతుడనే బైబిల్ దేవుడు ఎంత గొప్పవాడో ఆలోచించండి. ఇలాగే అబద్ధాలు చెప్పి మరోసారి ధనాన్ని, పశువులను సంపాదించుకుంటాడు అబ్రాహాము.

దావీదు అనే ప్రవక్త తన సైన్యంలో పని చేసే ఊరియా అనే వాడి భార్యను మోహించి ఆమెతో శయనించుతాడు. కుట్రతో ఊరియా మరణించేలా చేస్తాడు. గొప్ప న్యాయకారి అయిన బైబిల్ దేవుడు దావీదుని చంపేయాలి. కానీ ఈ నిజదేవుడు, సత్యదేవుడు ఏం చేశాడు? దావీదు, తాను మోహించిన బత్షెబకు పుత్రున్ని చంపేస్తాడు. దావీదు చేసిన తప్పుకు శిక్షగా దావీదు భార్యలను అతడి కొడుకైన అబ్షాలోముకు అప్పగించుతాడు.

**రెండవ సమూయేలు 16:22-కాబట్టి మేడ మీద వారు అబ్షాలోమునకు గుడారము వేయగా ఇశ్రాయేలీయులకందరికి తెలియునట్లుగా అతడు తన తండ్రి ఉపపత్నులను కూడెను.** బైబిల్ దేవుడు ఈ గొప్ప న్యాయం చేయలేదు, దీనిలో దేవుడికి ప్రమేయం లేదని అనుకోవడానికి వీలులేదు. ఈ పనిని చేయించింది





బైబిల్ దేవుడు. ఈ వచనం చదివితే మీకు విషయం అర్థం అవుతుంది. బైబిల్ దేవుడు దావీదులో చెప్పిన ఈ మాటలు ఆణిముత్యాలు!

**రెండవ సమూయేలు 12:11- నా మాట ఆలకించుము; యెహోవానగు నేను సెలవిచ్చునదేమనగా-నీ యింటివారి మూలముననే నేను నీకు అపాయము పుట్టింతును; నీవు చూచుచుండగా నేను నీ భార్యలను తీసి నీ చేరువ వాని కప్పగించెదను.**

ఇలాంటి ప్రవక్తలను గొప్పవారని, ఇలాంటి బైబిల్ దేవుడిని నిజదేవుడని చెబుతున్నారు ఈ క్రైస్తవులు. వ్రాసిన వాడికి సిగ్గులేదు; చదువుతున్న మీకు కూడా బుద్ధిలేదా? దావీదు అనే వాడు చేసిన తప్పుకు అమాయకులైన దావీదు భార్యలను శిక్షించడం ఏమిటి? దావీదు, బత్షెబ తప్పు చేస్తే, ఈ ఇద్దరిని వదిలి, అథం శుభం తెలియని శిశువును చంపడం ఏమిటి?

తన సొంత తండ్రితో సంభోగించి పిల్లలను కనే కూతుర్లు (ఆదికాండం అధ్యాయం 19), కోడలుతో సంభోగించే మామ (ఆదికాండం అధ్యాయం 38), చెల్లెలు పైన మోజు పడి బలాత్కారం చేసే అన్న (రెండవ సమూయేలు అధ్యాయం 13), ఇలాంటి గ్రంథం నుండి, ఇలాంటి ప్రవక్తల నుండి, ఇలాంటి బైబిల్ దేవుడి నుండి మనం ఏం నేర్చుకోవాలి? ఇలాంటి మతం నుండి ఎలాంటి నీతిని ఆశించాలి? ఈ మతం ప్రపంచాన్ని సర్వనాశనం చేస్తుంది కానీ నీతిని నేర్పించదు.

నాలుగవ ప్రశ్న

## నీవు యేసును అనుసరించగలవా? అనుసరించి బ్రతుకగలవా?

యేసు శత్రువులను కూడా ప్రేమించమన్నాడు. ఒక చెంప పైన ఎవరైనా కొడితే మరో చెంప చూపెట్టమని చెప్పాడు. ఈనాటి క్రైస్తవులు ఇలాంటి పనులు చేయుగలరా?

**మత్తయి సువార్త 5:44-నేను మీతో చెప్పునదేమనగా, మీరు పరలోకమందున్న మీ తండ్రికి కుమారులై యుండునట్లు మీ శత్రువులను ప్రేమించుడి. మిమ్మును హింసించు వారి కొరకు ప్రార్థన చేయుడి.**

**మత్తయి సువార్త 5:39-నేను మీతో చెప్పునదేమనగా దుష్టుని ఎదిరింపక, నిన్ను కుడి చెంప మీద కొట్టువాని వైపునకు ఎడమ చెంప కూడ త్రిప్పుము.**

శత్రువును ప్రేమించే మాట అటు పెడదాం; తమ సొంత క్రైస్తవులను కూడా వదలలేదు. తమ సిద్ధాంతానికి వేరుగా ఉన్న పద్ధతులను (హెరెసి-Heresy) పాటించుతున్నారు అనే నెపంతో లక్షలు, కోట్ల మంది క్రైస్తవులనే చంపారు. థియోడోసియస్ I (380) అనే రోమను రాజు భిన్న మత విశ్వాసాలను పాటించడం చట్ట వ్యతిరేకమని శాసనాన్ని ప్రతిపాదించాడు. ఈ చట్టం ఆధారంగా ప్రిసీలియన్ అనే క్రైస్తవుడిని చంపారు రోమన్లు. అలెగ్జాండ్రియా, ఐరోపులో కోట్ల మంది అమాయకులను బలవంతంగా మతం మార్చారు, క్రైస్తవాన్ని భిన్నంగా పాటించినందుకు వారిని చంపారు కూడా. అమెరికా, ఆఫ్రికా, ఆస్ట్రేలియాలో లక్షలు, కోట్ల మందిని చంపారు. నల్ల వాళ్లను, ఇతర జాతులను బానిసలను చేసి, వారిని జంతువులకంటే హీనంగా చూశారు. ఎక్కడి ప్రేమ మతం ఇది? వారిని దుర్మార్గులను ముద్ర వేసి, వారిని సమూలంగా నాశనం చేశారు. వందల





నాగరికతలు సంపూర్ణంగా నిర్మూలించబడినాయి. ఇది ప్రేమ మతమా?

అయితే బైబిల్ వచనాలు చదివితే, యేసు చెప్పిన అరకొర మాటలను క్రైస్తవులు ఎప్పుడూ పట్టించుకోలేదు. వాళ్ళు యేసు చెప్పిన ఇతర బలమైన మాటలనే అనుసరించారు. యేసు చెప్పిన గొప్ప మాటలను చదవండి.

**మత్తయి సువార్త 10:35-ఒక మనుష్యునికిని వాని తండ్రికిని, కుమార్తెకును, ఆమె తల్లికిని, కోడలికిని, ఆమె అత్తకును విరోధము పెట్టవచ్చితిని. 36- ఒక మనుష్యుని యింటివారే అతనికి శత్రువులగుదురు.**

**మత్తయి సువార్త 10:37-తండ్రినైనను, తల్లినైనను, నా కంటె ఎక్కువగా ప్రేమించువాడు నాకు పాత్రుడుకాడు; కుమారునినైనను కుమార్తెనైనను నాకంటె ఎక్కువగా ప్రేమించువాడు నాకు పాత్రుడు కాడు; 38-తన సిలువను ఎత్తికొని నన్ను వెంబడింపనివాడు నాకు పాత్రుడు కాడు.**

**మత్తయి సువార్త 19:29-నా నామము నిమిత్తము అన్నదమ్ములనైనను, అక్క చెల్లెండ్రనైనను, తండ్రినైనను, తల్లినైనను, పిల్లలనైనను, భూములనైనను, ఇండ్లనైనను, విడిచిపెట్టిన ప్రతివాడును నూరు రెట్లు పొందును; ఇదిగాక నిత్యజీవమును స్వతంత్రించుకొనును.**

**లూకా సువార్త 12:51-నేను భూమి మీద సమాధానము కలుగజేయవచ్చితినని మీరు తలంచుచున్నారా? కాదు; భేదమునే కలుగ జేయవచ్చితినని మీతో చెప్పుచున్నాను. 52-ఇప్పటి నుండి ఒక ఇంటిలో అయిదుగురు వేరుపడి, ఇద్దరికి విరోధముగా ముగ్గురును, ముగ్గురికి విరోధముగా యిద్దరును ఉందురు. 53-తండ్రి కుమారునికిని, కుమారుడు తండ్రికిని, తల్లి కుమార్తెకును, కుమార్తె తల్లికిని, అత్త కోడలికిని, కోడలు అత్తకును విరోధులుగా ఉందురని చెప్పెను.**

**మత్తయి సువార్త 18:8-కాగా నీ చెయ్యియైనను, నీ పాదమైనను నిన్ను అభ్యంతరపరచినయెడల, దానిని నరికి నీ యొద్ద నుండి పారవేయుము; రెండు చేతులును, రెండు పాదములును కలిగి నిత్యాగ్నిలో పడవేయబడుట కంటె కుంటి**

**వాడవుగనో, అంగహీనుడవుగనో, జీవములో ప్రవేశించుట నీకు మేలు. 9-నీ కన్ను నిన్ను అభ్యంతర పరచినయెడల దాని పెరికి నీ యొద్ద నుండి పారవేయుము; రెండు కన్నులు గలిగి అగ్నిగల నరకములో పడవేయబడుట కంటె ఒక కన్ను గలిగి జీవములో ప్రవేశించుట నీకు మేలు.**

యేసు బోధనలు దేశాలనే కాదు, కుటుంబ వ్యవస్థను కూడా సర్వనాశనం చేయడానికే వచ్చాయి. కుటుంబాలు సర్వనాశనం అయితే దేశం కూడా నశించుతుంది.

**లూకా సువార్త 9:59-ఆయన మరియొకనితో-నా వెంటరమ్మని చెప్పెను. అతడు నేను వెళ్లి మొదట నా తండ్రిని పాతి పెట్టి వచ్చుటకు సెలవిమ్మని మనవి చేసెను. 60-అందుకాయన-మృతులు తమ మృతులను పాతిపెట్టుకొననిమ్ము; నీవు వెళ్లి దేవుని రాజ్యమును ప్రకటించుమని వానితో చెప్పెను.**

తన తండ్రి చచ్చిపోయాడు, శవాన్ని పాతిపెట్టి వస్తానంటే, యేసు వద్దు, వెళ్లి సువార్త ప్రకటించమని చెబుతున్నాడు. ఎంత దారుణమో చూడండి. ఇలాంటి వాడినా దేవుడని, దేవుడి కుమారుడని చెబుతున్నారు.

**లూకా సువార్త 10:11-మీరు దాని వీధులలోనికి పోయి మా పాదములకు అంటిన మీ పట్టణపు ధూళిని కూడ మీ యెదుటనే దులిపి వేయుచున్నాము; అయినను దేవుని రాజ్యము సమీపించి యున్నదని తెలిసికొనుడని చెప్పుడి. 12-ఆ పట్టణపు గతికంటె సొదొమ పట్టణపు గతి ఆ దినమున ఓర్వ తగినదైయుండునని మీతో చెప్పుచున్నాను.**

తన సువార్తను నమ్మకుంటే రెండవ రాకడలో వాళ్ల గతి సొదొమ పట్టణంలాగా అవుతుందట. ఈ మాటలలో ప్రేమ ఎక్కడ ఉంది?





అయిదవ ప్రశ్న

## మ్లేచ్ఛమతానికి మారి నీవు నాశనం అవుతావా?

బైబిల్‌లో చెప్పబడిన దేవుడికి దేవుడి లక్షణాలు లేవు. ఆయనకు ప్రతిష్ఠిత జనులైన ఇశ్రాయేలు వారిలో 10 తెగలు ఎక్కడ ఉన్నాయో తెలియదు. నశించిపోయి ఉంటాయని చెబుతారు. కేవలం యూదా, బెంజమిన్ తెగలు మాత్రమే ఉన్నాయి. ఇశ్రాయేలు ప్రజలు ఎదురు చూస్తున్న మెస్సయ్య రెండు వేల సంవత్సరాల నుండి ఇంకా రాలేదు. వస్తాడనే నమ్మకం లేదు. కొందరు యేసు అనే కల్పితమైన పాత్రని సృష్టించి యూదులకు రుద్ద బోయారు. వాళ్లు ఈ రోజుకు కూడా యేసును అంగీకరించలేదు. కానీ రోమను రాజులు ఐరోపు దేశాలకు, తరువాత కాలంలో ప్రపంచానికి బలవంతంగా రుద్దారు. యూదులకు పుట్టిన మతాన్ని తీసుకొని, దానిని వ్యాపారంగా మార్చి, ప్రపంచాన్ని దోచుకుంటున్నారు.

ముందుగా క్రైస్తవులు ఇశ్రాయేలు ప్రజలను నాశనం చేయగా, తరువాత కాలంలో ముస్లిములు వారిని చంపారు. వారినే కాపాడలేని ఈ బైబిల్ దేవుడు, ఆయన కుమారుడు భారతదేశంలో ఉన్న మనల్ని కాపాడతాడా?

యూదులే నమ్మని యేసును ప్రపంచానికి బూచిగా చూపెడుతూ, భయమే ఆయుధంగా, మతమార్పిడి చేసుకుంటూ, భారతీయులకు కూడా దేశద్రోహులుగా తయారు చేస్తున్నారు. ఈ పాస్టర్లు ఇతరదేశాలలో ఉన్న క్రైస్తవ సంస్థలతో కుమ్ముక్కు అయి, వారి నుండి ధనాన్ని తీసుకొని, దేశానికి వ్యతిరేకంగా పని చేస్తున్నారు.

**భారతదేశపు జెండా గుడ్డ ముక్క అంటాడు ఒక క్రైస్తవ మతోన్మాది. భరతమాతకు ఎంత మంది భర్తలు అంటాడు మరొకడు. భారతదేశాన్ని ముక్కలు చేసి మాకు ఒక క్రైస్తవదేశాన్ని ఇవ్వండి అంటాడు సిగ్గు లజ్జా లేని సన్నాసి మరొకడు. తన సభ**

**నడవడానికి భారతదేశ క్రికెటు టీం ఓడిపోవాలని కోరుకుంటాడు మరొక దేశద్రోహి**

కొందరు క్రైస్తవ బోధకులు నక్సలైట్లు, చైనాతో కలిసి దేశవ్యతిరేక పనులు చేస్తున్నారు. వీళ్లు జీహాదీ శక్తులతో కలిసి భారతదేశానికి, సనాతన ధర్మానికి శత్రువులుగా తయారు అయ్యారు. ఈశాన్య రాష్ట్రాలలో విపరీతమైన మతమార్పిడులను చేస్తూ, అక్కడ వేర్పాటువాదాన్ని ప్రోత్సహించుతున్నారు. ఎదిరించిన వారిని, మతమార్పిడులను ఆపిన వారిని చంపుతున్నారు.

ఆగస్ట్ 21, 2000 సంవత్సరంలో చర్చి ద్వారా నడుస్తున్న నేషనల్ డెమోక్రటిక్ ఫ్రంట్ ఆఫ్ బోడోలాండ్ అనే తీవ్రవాద సంస్థకు చెందిన ఉగ్రవాదులు, బోడో సాహిత్య సభ అధ్యక్షుడు శ్రీ బినేశ్వర్ బ్రహ్మను కాల్చి చంపారు. ఇలాగా ఎందరో అమాయకులను, అనేక తెగల వారిని చంపారో లెక్కలు లేవు. వేల సంవత్సరాల నుండి ఈశాన్య రాష్ట్రాలలో అక్కడి తెగల వారు జరుపుకుంటున్న పండగలను జరుపుకోవద్దని బెదిరించుతూ, అక్కడి నాగరికతను క్రమంగా నాశనం చేస్తున్నారు ఈ క్రైస్తవ మాఫియా. ఈశాన్యంలో ఉన్న క్రైస్తవ తీవ్రవాద సంస్థలకు ఇతర దేశాల నుండి దండిగా డబ్బులు వస్తుంటాయి.

ఇప్పుడు ఉన్న ప్రభుత్వం వలన అప్పనంగా వచ్చే డబ్బులు ఆగిపోయాయి. మతమార్పిడులు కూడా తగ్గుముఖం పట్టాయి. అందుకు వీళ్లకు చెప్పలేనంత బాధ కలుగుతుంది.

లేని దేవున్ని ఇజ్రాయేలు ప్రజలు కల్పించుకుంటే, మరో కల్పితమైన పాత్రను సృష్టించి ఒక దోపిడి వ్యవస్థను తయారు చేస్తే, దానిని నమ్మి మనం మన జీవితాలను బలి చేసుకోవడం ఏమిటి? మన దేశాన్నే నాశనం చేసుకోవడం ఏమిటి?

**మతం మారిన ఏ ఒక్కరు కూడా బైబిల్‌ను చదివి మారడం లేదు.** రోగాలు తగ్గాయి అంటూ, మంచి జరిగింది అంటూ అబద్ధపు సాక్ష్యాలతో, చైన్ మార్కెటింగు లాగా పని చేస్తూ, మోసాలతో మతమార్పిడి చేస్తున్నారు. కావున క్రైస్తవులారా! ఇప్పటికైనా మేలుకోండి. ఈ మ్లేచ్ఛ మతానికి స్వస్తి చెప్పి, మన దేశాన్ని, ధర్మాన్ని





కాపాడుకుందాం. తమ సంపాదన కోసం పరాయి దేశాలకు వత్తసుపాడే పాస్టర్లను ప్రశ్నించి, వారి ఆటలను కట్టిద్దాం.

జై భారత్! జై భారత్!!

## బైబిల్ గ్రంథం, క్రైస్తవుల కుట్రలు, వారి అబద్ధాలు వాటి జవాబులు

### 1. యేసు మన పాపాల కోసం బలి అయ్యాడు.

ప్రశ్నలు:

1. మరణించేవాడు ఎలా దేవుడు అవుతాడు? మూడు మేకులకు చచ్చేవాడు దేవుడా? దేవుడు మరణించడు. ఈ విషయం బైబిల్ కూడా చెబుతుంది.

**హబక్కూకు 1:12- యెహోవా నా దేవా, నా పరిశుద్ధ దేవా, ఆది నుండి నీవున్నవాడవు కావా? నీవు మరణము నొందవు;** కొత్త అనువాదాలలో నీవుకు బదులుగా మీరు అని వక్రీకరించారు. యేసు మరణించి, మూడు రోజులకు లేచాడు అనే కొత్త సిద్ధాంతాన్ని తీసుకొని వచ్చారు.

**మొదటి తిమోతికి 6:16-సమీపింపరాని తేజస్సులో ఆయన మాత్రమే వసించుచు అమరత్వము గల వాడైయున్నాడు. మనుష్యులలో ఎవడును ఆయనను చూడలేదు, ఎవడును చూడనేరడు; ఆయనకు ఘనతయు శాశ్వతమైన ప్రభావమును కలిగియుండును గాక. ఆమేన్.** బైబిల్ ప్రకారం దేవుడు త్రిత్వంగా ఉన్నాడని అంటారు, కానీ అలాంటి వచనం లేదు, కల్పించారు.

2. యేసు, యెహోవా ఒక్కడే అంటారు కదా! అంటే యేసు తనకు తానే యెహోవాకు బలి అయ్యాడా? ఇదేమి వింత? యెహోవా అయిన తండ్రి, తన కొడుకు అయిన యేసుని చంపి, మన పాపాలను తొలగించాడు. తన కొడుకును తనకే బలిగా అర్పించాడు. పాపాలను క్షమించితే సరిపోతుంది కదా, బలులు ఎందుకు?

3. నా కోసం చనిపోమని నేను ఎవ్వరిని అడగలేదు, నేను పాపం చేస్తానని యేసుకు ముందే తెలుసా? యేసు మన పాపాల కోసం మరణించాడని నమ్మలట.





నేను పాపిని అని వీళ్లు తీర్మానించుకున్నారు.

4. యేసు చరిత్ర ప్రకారం పుట్టలేదని చెబుతారు కదా! యేసు ఏ తేదిన జన్మించాడో బైబిల్‌లోనే స్పష్టత లేదు. జన్మించినట్టు ఏ చరిత్రకారుడు వ్రాయలేదు. పుట్టిన వాడు చచ్చే అవకాశం ఉంది, పుట్టని వాడు ఎలా చచ్చిపోతాడు?

5. యూదుల కోసం వచ్చిన యేసుని యూదులే నమ్మడం లేదు. వాళ్లు యేసుని నమ్మరు, క్రైస్తవ సిద్ధాంతాన్ని కూడా నమ్మరు. యేసుని వేశ్య పుత్రుడు అని అంటారు. మనం ఎందుకు నమ్మి మోసపోవాలి?

### 2. మానవులు పాపులు. మనం పాపం చేశాం. యేసును నమ్ముకుంటే మన పాపం పోతుంది.

ప్రశ్నలు.

1. నన్ను పాపి అంటే చెప్పుతో కొడతాను. నేను పాపిని అని నన్ను అవమానించడం నేను ఒప్పుకోను. అందుకే చెప్పుతో కొడతాను అంటున్నాను. నేను ఆదాము, హవ్వలకు పుట్టలేదు, నేను మనువుకు జన్మించాను.

2. బైబిల్ ప్రకారం పాపమంటే ఏమిటి? **కీర్తనల గ్రంథము 51:5-నేను పాపములో పుట్టినవాడను పాపములోనే నా తల్లి నన్ను గర్భమున ధరించెను.** నేను ఆదాము వంశము వాడిని కాదు.

3. బైబిల్ ప్రకారం పాపమంటే యెహోవా ఆజ్ఞ తిరస్కరించడం పాపం. **మొదటి యోహాను 3:4-పాపము చేయు ప్రతివాడును ఆజ్ఞను అతిక్రమించును; ఆజ్ఞాతిక్రమమే పాపము.** నేను యెహోవాను ఎప్పుడు నమ్మలేదు, నమ్మను కూడా. యెహోవా యూదుల కోసం వచ్చిన వాడు నాకు సంబంధం లేదు.

4. మానవులంతా మనువుకు పుట్టారు కదా! ఆదాముకు పుడితే కదా పాపులు అవుతారు. మహాభారతం, ఆదిపర్వం, అధ్యాయం 75, శ్లోకం 13 లో**"మనోర్వంశో**

**మానవానాం తతో అయం ప్రథితో భవత్"** అని చెప్పబడింది. మనువు వంశములో జన్మించిన మానవులకు మానవజాతిగా ప్రసిద్ధి కలిగింది అని అర్థం. ఆదాము చరిత్రలో ఉన్నట్టు ఆధారాలు లేవు.

5. బైబిల్ ప్రకారం రేపులు, హత్యలు, అబద్ధాలు, లూటీలు చేసినా తప్పు కాదు కదా. ఇశ్రాయేలీయులు, యూదులు లక్షల మంది పురుషులను, స్త్రీలను, పిల్లలను చంపారు. పిల్లలను, స్త్రీలను చెరబట్టారు. ప్రపంచమంతా క్రైస్తవులు అదే చేశారు. ఈ రోజుకూ పాస్టర్లు చర్చిలలో మానభంగాలు చేస్తున్నారు. అది అసలైన పాపం.

**3.యేసును నమ్మి, క్రైస్తవానికి మారితే కష్టాలు పోతాయి, ఆరోగ్యం బాగుపడుతుంది.**

ప్రశ్నలు.

1. మీ ప్రకారం క్రైస్తవులు అందరూ ధనవంతులే; మరి ఆఫ్రికా దేశాలలో, అమెరికాలో ఉన్న ధనంలేని క్రైస్తవుల సంగతి ఏమిటి? కటిక బీద క్రైస్తవ దేశాలు ఉన్నాయి. మన దేశంలో కూడా పేదలు, దరిద్రులైన క్రైస్తవులు ఉన్నారు. వారి సంగతి ఏమిటి?

2. అందరి సంగతి సరే. తమరు రోడ్డు పైన ఇలా భిక్షం ఎత్తుకుంటున్నారు కదా (మతం మారమని), దాని సంగతి ఏమిటి? దీని వలన మీకు ఏం వస్తుంది? మీకు ఎవరు డబ్బులు ఇస్తారు?

3. మీ ప్రకారం అసలు క్రైస్తవులకు రోగాలే ఉండ కూడదు. రోగాలతో బాధ పడే క్రైస్తవులను ఎందరిని చూపించాలి? వారు యేసుని నమ్మడం లేదా! మీకు షుగరు, బి పి ఉందా? దాని సంగతి ఏమిటి?

4. రోగాలతో హాస్పిటలల్లో మరణించే క్రైస్తవుల సంగతి ఏమిటి? క్రైస్తవులు అసలు చనిపోరా?





5. యేసు జబ్బులను నయం చేయగలిగితే, నాతో వచ్చి హాస్పిటల్లో ఉన్న రోగులను, వారి వ్యాధులను నయం చెయ్యి. అప్పుడు నేను కూడా నమ్ముతాను.

**4. మా దేవుడు నిజ దేవుడు, సత్య దేవుడు.**

ప్రశ్నలు.

1. బైబిల్‌లో చెబితే నిజం అవుతుందా? నిజ దేవుడు సత్య దేవుడు అని చెప్పుకుంటే నిజం అయిపోతుందా? ఉన్నట్టు నిరూపణ ఎవరు చేశారు? అన్యుల పట్ల ద్వేషం కలిగిన వాడు దేవుడా? **ద్వితీయోపదేశకాండము 20:13-నీ దేవుడైన యెహోవా దాని నీ చేతి కప్పగించునప్పుడు దానిలోని మగవారినందరిని కత్తివాత హతము చేయవలెను. 14-అయితే స్త్రీలను చిన్నవారిని, పశువులను, ఆ పురములో నున్నది యావత్తును దాని కొల్ల సొమ్మంతటిని నీవు తీసికొన వచ్చును; నీ దేవుడైన యెహోవా నీకిచ్చిన నీ శత్రువుల కొల్లసొమ్మును నీవు అనుభవించుదువు.**

2. యెహోవా, యేసు నిజమైన దేవుళ్లని ఎవరైనా నిరూపించారా? అయితే ఎలా దేవుళ్లో, ఎవరికి మేలు చేశారు, దేవుడికి ఉండవలసిన లక్షణాలు ఏమున్నాయో డిబేటు చేసి నిరూపించండి.

3. వీళ్లు ఎక్కడ ఉంటారు, ఎవరికి కనిపించారు? బైబిల్‌లో కాకుండా, ఇతర సాహిత్యంలో వీళ్ల గురించి ఎక్కడ చెప్పబడిందో వివరించి, నిరూపించండి.

4. యూదులనే రక్షించలేని వాడు, తన పైన అసంతృప్తి చూపారని తన ప్రజలనే చంపిన దేవుడు మాకు ఎలా దేవుడు అవుతాడు? **సంఖ్యాకాండము 21:6-అందుకు యెహోవా ప్రజలలోనికి తాపకరములైన సర్పములను పంపెను; అవి ప్రజలను కరువగా ఇశ్రాయేలీయులలో అనేకులు చనిపోయిరి.**

5. యూదుల మధ్యన అక్రమ సంబంధాలను పెట్టేవాడు, వాళ్లకు సరైన ఆహారం, నీళ్లు ఇవ్వలేని వాడు, వాళ్ల పిల్లల మాంసమును వారితో తినిపించే వాడు దేవుడు

ఎలా అవుతాడు? ద్వితీయోపదేశకాండము **28: 52-మరియు నీవు ఆశ్రయించిన ఉన్నత ప్రాకారములుగల నీ కోటలు పడు వరకును నీ దేశమందంతటను, నీ గ్రామములన్నిటిలోను, వారు నిన్ను ముట్టడి వేయుదురు. నీ దేవుడైన యెహోవా నీకిచ్చిన నీ దేశ మందంతటను నీ గ్రామములన్నిటిలోను నిన్ను ముట్టడి వేయుదురు. 53-అప్పుడు ముట్టడిలోను నీ శత్రువులు నిన్ను పెట్టు ఇబ్బందిలోను నీ గర్భఫలమును, అనగా నీ దేవుడైన యెహోవా నీకిచ్చిన నీ కుమారుల యొక్కయు, నీ కుమార్తెల యొక్కయు, మాంసమును తిందువు.**

**5. వివేకానందుడు, గాంధీ, కీరవాణి, యేసు గొప్పవాడని చెప్పారు.**

ప్రశ్నలు.

1. యేసు గొప్పవాడని వివేకానందుడు చెప్పాడు కానీ మతం మారలేదు. అది వివేకానందుడు గొప్పదనం. హిందువు మతం మారితే మనలో ఒకడు తగ్గినట్టు మాత్రమే కాదు, మనకు ఒకడు శత్రువు అయినట్టు అన్నారు వివేకానందుడు. అలా ఎందుకు అన్నారు?

2. అమెరికాలో వివేకానందుడిని క్రైస్తవులు విషం పెట్టి చంపడానికి ప్రయత్నించారు. దీనిని ఏమంటారు? ఆడవాళ్లని ఎరగా పెట్టి ఆయనను కూడా మతం మార్చడానికి ప్రయత్నించారు. ఏమంటారు? మన దేవీదేవతలను తిట్టిన క్రైస్తవులను ఆయన సముద్రంలో తోసి వేస్తానని బెదిరించారు, నీకు తెలుసా?

3. వివేకానందుడు బుద్ధుడిని, కృష్ణుడిని కూడా నమ్మారు. దాని సంగతి ఏమిటి? మరి ఆయన లాగా నువ్వు కూడా బుద్ధుడిని, శ్రీ కృష్ణుడిని నమ్ముతావా?

4. వివేకానందుడు అమ్మవారిని పూజించే వారు. దాని సంగతి ఏమంటారు? నేను యేసును నమ్మను. హిందూ ధర్మాన్నే నమ్ముతాను.

5. వివేకానందుడు అసలు యేసు అనే వాడు లేడని అన్నారు. క్రైస్తవం కల్పితమని వివేకానందుడే చెప్పారు కదా! నువ్వు ఆయన చెప్పింది ఒప్పుకుంటావా?





**6. వేదాలలో, భవిష్య పురాణంలో యేసు ఉన్నాడు కాబట్టి మతం మారండి.**

ప్రశ్నలు.

1. వేదాలు, పురాణాల ప్రకారం విష్ణువు, శివుడు, దేవీ శక్తులందరు శ్రీ కృష్ణుడి నుండి వచ్చారు. కాబట్టి మీ ప్రకారం యెహోవా, యేసును శ్రీ కృష్ణుడు పుట్టించాడని ఒప్పుకుంటున్నారా? అప్పుడు యెహోవా, యేసు దేవుళ్లు కాదు. అలా అయితే నాకు ఇబ్బంది లేదు.

2. వేదాలలో యేసు ఉంటే క్రైస్తవులు అందరు తమ మతాన్ని వదిలి సనాతన ధర్మానికి మారాలి. తమరు ఎప్పుడు సనాతన ధర్మంలోనికి వస్తున్నారో చెప్పండి.

3. వేదాలలో యేసు ఉంటే, తమరు బైబిల్‌ను వదిలేసి, చర్చిలలో యజ్ఞాలను చేయాలి. నేను పండితులను తీసుకొని వస్తాను. ఎప్పుడు రావాలి?

4. వేదాలలో యేసు ఉన్నాడంటే, ఇక మనకు బైబిల్‌తో పని లేదు. బైబిల్‌ను పక్కన పెట్టేయండి.

5. వేదాలలో పురాణాలలో యెహోవా, యేసు పేరు ఉందా? చూపించగలవా?

**7. దేవుడు ఒక్కడే, మీకు అనేక దేవుళ్లు ఉన్నారు. చాలా దేవుళ్లను పూజించడం తప్పు**

ప్రశ్నలు.

1. బైబిల్‌లో ఉన్న యెహోవా, యేసు, పరిశుద్ధ దయ్యం అందరూ ఒక్కటే అని చూపించగలవా? ఎక్కడా లేదు. బైబిల్‌లో లేనిది చెబితే రోగాలు వస్తాయట కదా!

2. ముగ్గురుని పూజించడం కూడా తప్పే కదా! ఈ ముగ్గురిలో దేవుడు ఎవరు?

3. యెహోవా లక్షల మంది యూదులనే చంపాడు, కోట్ల మంది అన్యులను చంపాడు. అతడు దేవుడెలా అవుతాడు? లక్షల మంది స్త్రీలను, పిల్లలను చంపాడు.

దేవుడెలా అవుతాడు?

4. యెహోవా మాత్రమే దేవుడని ముందు నిరూపించండి. తరువాత మాట్లాడండి. అసలు దేవుడి లక్షణాలు ఉన్నాయో నిరూపించండి. మా పురాణాలలో ఉన్న రాక్షసులు యెహోవా కంటే వేయి రెట్లు మేలు.

5. కొన్ని తెగల క్రైస్తవులు మేరీని కూడా పూజిస్తారు. మరి క్రైస్తవంలో నలుగురు దేవతలు ఉన్నారు కదా! ముందు మీ పద్ధతులను మార్చుకొని, తరువాత మాకు నీతులు చెప్పండి.

**8.యేసును నమ్మితే మీరు పరలోకానికి వెళతారు. నమ్మకుంటే నిత్య నరకం.**

ప్రశ్నలు.

1. పరలోకం ఎక్కడ ఉందో ముందు చెప్పండి. ఎవరు పరలోకానికి వెళ్లారో కూడా నిరూపించండి. యేసు రెండవ రాకడ వచ్చినప్పుడే కదా పరలోకం వెళ్లేది. 2000 సంవత్సరాల నుండి ఏదో కథలు చెప్పి మోసం చేస్తున్నారు.

2. ఆత్మ అంటే బైబిల్ ప్రకారం ఏమిటి? వివరించండి. బైబిల్‌లో ఎలాంటి వివరణ లేదు.

3. బ్రతికి ఉండగానే పరలోకం వెళ్లము కదా! మానవులు చనిపోయిన తరువాత ఏం అవుతుందో మీకు తెలుసా? మరి తెలియని విషయాల గురించి ఎందుకు చెబుతారండి?

4. నమ్మితే పరలోకం, నమ్మకుంటే నరకం అనే దేవున్ని నమ్మడం ఏమిటి? ఇది భయ పెట్టడం కాదా? పరలోకం వెళ్లి ఏం చేయాలి? అక్కడ ఏముంటుంది?

5. పాత నిబంధనలో పరలోకం గురించి యెహోవా ఎక్కడ చెప్పారు? నేను పరలోకానికి అందరిని తీసుకొని వెళతానని యెహోవా ఎక్కడ చెప్పాడు?





**9. బైబిల్ దేవుడు కరుణామయుడు.**

ప్రశ్నలు.

1. బైబిల్ దేవుడు కరుణామయుడు అయితే లక్షల మంది యూదులను, కోట్ల మంది అన్యులను ఎందుకు చంపాడు?

2. యూదులలో అక్రమ సంబంధాలను ప్రోత్సహించాడు. లక్షల కోట్ల జంతువులను బలిగా తీసుకొని, కాళ్ళ బలిగా ఇవ్వమన్నాడు. ఎందుకు?

3. తనను నమ్మకుంటే సొదొమ, గొమొర్రా లాంటి గతి అవుతుందని యేసు చెప్పాడు. ఇది ప్రేమ అని అందామా?

4. యేసు తన కుటుంబాన్ని, తల్లితండ్రులను, తన వాళ్లని ద్వేషించమని, వారిని వదిలి వేయమని చెప్పాడు. ఇది ప్రేమ ఎలా అవుతుంది?

5. తన కొడుకు యేసుని చంపిన యెహోవా ఎలా కరుణామయుడు అవుతాడు? దారుణామయుడు అవుతాడు కానీ!

**10. విగ్రహారాధన తప్పు, చేయకూడదని వేదం కూడా చెబుతుంది. ఆర్యసమాజ్ వారు చెబుతున్నారు.**

ప్రశ్నలు.

1. విగ్రహారాధన చేయవద్దని వేదం, ఉపనిషత్తు చెప్పదు. ఆర్యసమాజ్ వారు చెబితే అది వాళ్ల తప్పుడు సిద్ధాంతం. మాతో డిబేటు చేయండి. మేము తప్పని నిరూపించండి.

2. కాథోలిక్, ఆర్థోడాక్స్ క్రైస్తవులు, మేరీని పూజించే వారు ఉన్నారు. మీరు ముందు వారిని మార్చి మాకు చెబితే బాగుంటుంది. మీరు నరకానికి పోతారని వాళ్లు చెబుతున్నారు. ఎవరు పోతారో మీరు నిర్ణయించుకోండి.

3. శిలువలు, యేసు బొమ్మలు, విగ్రహాలు కూడా విగ్రహ ఆరాధనే కదా! వాటిని మీరు పారవేయండి. తరువాత మనం మాట్లాడదాం.

4. బెత్లెహేముకు కూడా పోవద్దు. అది కూడా విగ్రహారాధనే.

5. చర్చీలలో ఉన్న యేసు విగ్రహాలను కూడా పారవేయండి. ఇవన్నీ చేసి మాకు చెప్పండి.

క్రైస్తవులు, క్రైస్తవ బోధకులు, మతమార్పిడి మాఫియా చెప్పే కథలకు, ప్రశ్నలకు జవాబులు ఉన్నాయి. మతం మారి ఉంటే, దాన్ని వదిలి తిరిగి రండి. మారకుండా ఉంటే, మీ ధర్మంలో జీవించండి.

**డా.భాస్కర రాజు,**
ధర్మమార్గం సేవా ట్రస్టు, భాగ్యనగరం.
మొబైల్-9000274345.
ఈమేల్- vbraju66@gmail.com



# మతం మారిన క్రైస్తవుడా!

## బైబిల్ దైవగ్రంథమా అందులో ఉన్నది నిజ దేవుడా?





డా॥ వి. భాస్కర్ రాజు